THE ANDHRA PATRIKA, MADRAS.

ఉత్తమ శైవమత గ్రంథము
పండితారాధ్య చరిత్ర
వెల రు 5-0-0లు, ప్యాకింగ్ పోస్టేజి రూ. 1-5-0.
ఆంధ్ర గ్రంథమాల
పోస్టు బాక్సు 212, మదరాసు 1.

# ఆంధ్రపత్రిక

శ్రీమద్భగవద్గీత
గ్రంథకర్త
శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు
ఆరవ ముద్రణము
వెల రు. 4-0-0 పోస్టేజి రు. 0-10-0
ఆంధ్రగ్రంథమాల, మద్రాసు 1

Regd. No. M, 1118 | సంపుటం 38. సంచిక 95 | FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. | శుక్రవారం 6-7-1951 | వెల 1 అణా.

# కొరియా యుద్ధవిరమణకు జులై 8 న ప్రాతిపదిక సంప్రతింపులు ప్రారంభం

## భగవద్దత్తమగు మానవహక్కులలో అమెరికా విశ్వాసం

### స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో భారత రిపబ్లిక్ అధ్యక్షునికి ట్రూమన్ సందేశం

న్యూఢిల్లీ, జులై 4: "175 సంవత్సరముల క్రిందట ఈనాడు అమెరికన్ కాంగ్రెసు అమెరికాను స్వేచ్ఛకల జాతిగాను, స్వతంత్రముకల జాతిగాను ప్రకటించెను. నూతనముగా అవిర్భవించిన అమెరికన్ జాతి స్వేచ్ఛాపజీవియని, సృష్టికర్త యావన్మంది మానవులను సమానులనుగా సృష్టించెనను మాత్రమునకు కట్టుబడి యున్నదని అమెరికన్ అధ్యక్షులలో ఉత్తమోత్తముడగు మహాశయుడు ప్రవచించియుండెను. ఏ ఆశయముల పై మాజాతి నిర్మింపబడెనో ఆ ఆశయములకు జీవితముల నర్పణచేయ అమెరికన్లు ఈనాడు కంకణము కట్టుకొనుచున్నారు. భగవద్దత్తమగు మానవ హక్కులలో తమకుగల పరమ విశ్వాసమును ఈనాడు అమెరికన్లు పునరుద్ఘాటించుచున్నారు." అని అమెరికా అధ్యక్షుడు ప్రెసిడెంటు ట్రూమెను భారత రిపబ్లిక్ అధ్యక్షులగు డా॥ రాజేంద్రప్రసాదుగారికి సందేశమంపుచు చెప్పుచున్నారు.

భారతదేశమునందలి అమెరికన్ ప్రతినిధి లాయ్‌హెండర్సన్ నేటి మధ్యాహ్నం 12 గంటలకు డా॥ రాజేంద్రప్రసాద్‌కు అందజేసిన సందేశములో యింకను ఈ క్రింది విషయములు కలవు: "భగవద్దత్తములగు ఈ మానవహక్కులు, అనేక ...

## ఈజిప్టులో బ్రిటిష్ సైనిక స్థావరాల నిర్మాణం

### ఈజిప్టు విదేశాంగమంత్రి హెచ్చరిక

కెయిరో, జులై 4: ఈజిప్టును ఆక్రమించుటకు గాని, ఈజిప్టులోని ప్రాంతమునైనను మిలిటరీ స్థావరంగా ఉపయోగించుటకు గాని బ్రిటన్‌కు ఎటువంటి హక్కు లేదని ఈజిప్టు విదేశాంగ మంత్రి సలాలుద్దీన్ పాషా నేడు ప్రకటించెను. మధ్యప్రాచ్య రక్షణ విషయంలో సూయజ్ కాలువ ప్రాంతాన్ని కీలక స్థావరంగా పరిగణించడానికి ఇటీవల లండన్‌లో జరిగిన కామన్వెల్తు రక్షణమంత్రుల సభలో చేసిన నిర్ణయం పైవ్యాఖ్యానిస్తూ పాషా పైవిధంగా అన్నారు. 1936 నాటి ఆంగ్లో ఈజిప్టు సంధి సవరణకుగాను బ్రిటన్ చేసిన ప్రతిపాదనలకు ఈజిప్టు సమాధానాన్ని ఈజిప్టులోని బ్రిటిషు రాయబారికి పాషా యీ వారాంతంలోగా సమర్పించ గలరని తెలుస్తున్నది.

... స్వతంత్ర సభ్యుడు మహమ్మద్ హాలవాన్ ప్రశ్నించెను. సైన్యం అమెరికా ఏవిధంగా సరిహద్దో, అదేవిధంగా ఈజిప్టుకు అరబ్ రాజ్యాలు మొదటి రక్షణ అని విదేశాంగ మంత్రి చెప్పెను. సమిష్టి రక్షణపథకం పై ఒక్క జోర్డాన్ మినహాగా మిగిలిన అరబ్ రాజ్యాలన్నీ సంతకం చేసినవని ఆయన చెప్పారు.

## కమ్యూనిస్టు ప్రతిపాదనకు సమితి సేనాని అంగీకారం

### కేసాంగ్లో ఇరుపక్షాల ప్రతినిధుల సమావేశానికి ఏర్పాట్లు

టోకియో, జులై 5: కొరియా యుద్ధ విరమణపై చర్చలకు ప్రాతిపదికగా ఉభయపక్షాల ప్రతినిధులు కేసాంగులో జులై 8 వ తేదీని సమావేశం జరపాలంటూ కమ్యూనిస్టు సైన్యాధిపతులు చేసిన కొత్త ప్రతిపాదనను సమితి సర్వ సైన్యాధ్యక్షుడు జనరల్ రిడ్జివే ఈరోజున అంగీకరించారు.

కొరియా యుద్ధవిరమణ పై చర్చలు జరపడానికి ముందుగా ఉభయపక్షాల లెయిజాన్ అధికారులు జులై 8 వ తేదీని కేసాంగులో సంభాషణలు జరపాలని జనరల్ రిడ్జివే మొదట సూచించారు. ఆయన ప్రతిపాదనను ఉత్తర కొరియన్, చైనా సైన్యాధిపతులు అంగీకరించినట్లు పైఅంగ్‌యాంగు రేడియో నిన్న ప్రకటించినది.

అనంతరం కమ్యూనిస్టులవద్దనుండి పైసందేశం వచ్చినట్లు జనరల్ రిడ్జివే కేంద్రకార్యాలయం ధృవపరిచినది. జులై 8 వ తేది (ఈరోజున) ఉభయపక్షాల లెయిజాన్ అధికారులు కేసాంగులో సమావేశం జరపాలంటూ జనరల్ రిడ్జివే పంపిన సందేశానికి ఇది సమాధానం.

... సందేశంలో ఇలా ఉన్నది:- "జులై 4న మీరు పంపిన సమాధానం చేరింది. జులై 8వ తేదీని సమావేశం జరపడానికి అంగీకరిస్తున్నాను.

"జులై 8న నేను పంపిన సందేశంలో ముగ్గురు లెయిజాన్ అధికారులను పంపుతున్నట్లు సూచించాను. వారికి తోడుగా ఇరువురు దుబాషీలను కూడా పంపడం జరుగుతుంది. వారి రక్షణకుకూడా హామీ ఇవ్వమని అభ్యర్థిస్తున్నాను."

### అష్టమసైన్య ప్రకటన

కేసాంగుకు పంపబడే లెయిజాన్ అధికారులతో కూడా వెళ్ళడానికి పత్రికా విలేఖరులకు అనుమతి ఇవ్వడం జరుగదని అమెరికా అష్టమసైన్యం గతరాత్రి ప్రకటించినది.

అయితే వారు కేసాంగుకు విమానంలో బయలుదేరే సమయంలో సెవ్రాల్‌లోని కింపో విమానాశ్రయంలో పత్రికా విలేఖరులు ఉండడానికి మాత్రం అనుమతి ఇవ్వబడుతుంది.

యుద్ధ విరమణ సంభాషణల విషయంలో పత్రికా విలేఖరులకు వార్తలు ...

... దక్షిణ కొరియా అధ్యక్షుడు సింగ్మన్ రీని కలుసుకున్నారు. వారు ఒకగంట సేపు సంభాషణలు జరిపారు.

యుద్ధ విరమణానంతరం సైన్యాల ఉపసంహరణ జరుగవచ్చునని జనరల్ వాన్‌ఫ్లీట్ ప్రకటించారు.

యుద్ధ విరమణపై కేసాంగులో జరిగే సంభాషణలలో పాల్గొనడానికి ప్రతినిధులను పంపమని దక్షిణకొరియా ప్రభుత్వాన్ని కోరడం జరుగలేదని ప్రచారశాఖామంత్రి డాక్టర్ క్లారెన్స్ రీ నిన్న ప్రకటించారు.

దక్షిణ కొరియా మంత్రివర్గం నిన్న సమావేశమై తగినసమయం వచ్చేపర్యంతం యుద్ధ విరమణ సంభాషణలపై వ్యాఖ్యానించకుండా ఉండడానికి నిర్ణయించినది.

### సమితి రేడియో ప్రకటన

ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం అమెరికా, రష్యాల సైన్యాధిపతులు కేసాంగు ప్రాంతంలోనే సమావేశమై, తమ సైన్యాల ఆక్రమణలో ఉండే ప్రాంతాల సరిహద్దులను నిర్ణయించారని న్యూయార్కులోని ఐక్యరాజ్య సమితి రేడియో ప్రకటించింది. కొరియాలోని ప్రాచీన నగరాలలో కేసాంగు ఒకటి. ...

### జనరల్ బ్రాడ్లీ వ్యాఖ్య

వాషింగ్టన్, జులై 4: కొరియాలో యుద్ధ విరమణపై జరిగే సంభాషణలకు ...

(2-వ పేజీ చూడుడు)

## ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవికి సంజీవరెడ్డిగారి రాజీనామా

### కాంగ్రెస్ అధ్యక్షునకు లేఖ: నిర్ణయాన్ని తిరిగి విచారించవలసిందని గోపాలరెడ్డిగారి అభ్యర్థన

మద్రాసు, జులై 5: ఆంధ్ర ప్రదేశ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి శ్రీ నీలం సంజీవ రెడ్డిగారు నేడు రాజీనామా ఇచ్చారు. నిన్నటి శ్రీ సంజీవరెడ్డిగారి కుమారుడు శ్రీ నా... ప్రమాదవశమున మిలిటరీ లారీక్రింద పడి మరణించెను. ఈ పుత్రశోకముతో తాము ప్రస్తుతము తమ యావచ్ఛక్తిని, కాలమును కాంగ్రెస్ కార్యక్రమమునకు వినియోగింపలేనని, ఆ కారణముననే తాము అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చుచుంటిమని శ్రీ సంజీవరెడ్డిగారు కాంగ్రెస్ అధ్యక్షుడు టాండన్‌కు వ్రాసిన లేఖలో తెలియజేశారు.

శ్రీ సంజీవరెడ్డిగారు నంద్యాలలో ఉండగా ఈ విషాదవార్త తెల్సి నేడుదయం మద్రాసు వచ్చారు. మిత్రులు పలువురు వారిని పరామర్శించిరి.

సంజీవ రెడ్డిగారు కాంగ్రెస్ అధ్యక్షునకు పంపిన లేఖలో ఈవిధంగా ఉంది: "స్వంత కారణాలవల్ల నేను ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు సంఘ అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చుచున్నాను. రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు తన యావచ్ఛక్తిని, కాలమును కాంగ్రెస్‌కు వినియోగించవలసిఉన్న ఈసమయంలో ...

... సంజీవరెడ్డిగారు తమ నిర్ణయమును తిరిగి విచారించుకొని రాష్ట్ర క్షేమము దృష్ట్యా రాజీనామాను ఉపసంహరించుకొందురని ఆశించుచున్నాను.

### శ్రీ గోపాలరెడ్డి అభ్యర్థన

### చంద్రమౌళిగారి విజ్ఞప్తి

## గంటకు 1,300 మైళ్ల విమాన వేగం

లాస్ ఏంజలిస్, జులై 4: అమెరికాలో "డగ్లస్" స్కై రాకెట్టు విమానమొకటి కొత్తగా నిర్మింపబడి ఇటీవల పరీక్షింపబడినది. శబ్దవేగానికంటె రెట్టింపు వేగంతో పోవలెననే సంకల్పంతో యిది నిర్మింపబడింది. అనగా గంటకు 1320 మైళ్ల వేగంతో పోవలెనని సంకల్పింపబడెను. కాని, అంత వేగం దానికిరాలేదు. కొద్దిగా లోపం వచ్చింది. గంటకు 1,300 మైళ్ల కంటె కొంచెం తక్కువ వేగంతో పైకెగిరెను. 70 వేల అడుగుల ఎత్తుకు పోగలెను. ఈ రాకెట్టు విమానవేగ వివరములు అమెరికను నౌకాదళాధికారులు వెల్లడించక రహస్యంగా ఉంచారు. కాని లాస్ ఏంజల్సులోని వివిధ పత్రికా సంపాదకుడైన మార్విను మైల్సుగారు పై వివరములను ప్రకటించిరి.

ఇంత వేగంతో పోయిన విమానమేదీన్నీ యింతవరకు నిర్మింపబడలేదు.

హెలికాప్టరు విమానాలలో ...

## మలాంచేసిన రేకులఖరీదు పెరుగుదల

న్యూఢిల్లీ, జులై 4: మలాంచేసిన రేకులు, ప్లేట్లు, షీట్లు వీటిఖరీదు, జులై నుంచి టన్నుకు వరుసగా 100; 60; 150; రూపాయలు పెరిగింది.

## సూనెగనులనుఖాళీచేయరాదని బ్రిటన్ తీర్మానం

### 'రసీదులు' సమస్యపై రాజీకి ప్రయత్నం

లండన్, జులై 4: దక్షిణ పర్షియా నూనెగని ప్రాంతాలనుంచి బ్రిటిష్‌వారులను ఖాళీ చేయకూడదన్న పట్టుదల బ్రిటనుకు ఎక్కువైనదని నేడిక్కడ ఒక విశ్వసనీయ వర్గంద్వారా తెలియవచ్చినది. ఆంగ్లో ఇరానియన్ కంపెనీ జనరల్ మేనేజర్ ఎరిక్ డ్రేక్‌తో సోమవారం నాడు బ్రిటిష్ మంత్రివర్గం జరిపిన సంప్రతింపులకు ఫలితంగా బ్రిటిష్‌వైఖరిలో ఈ మార్పు వచ్చినట్లు తెలుస్తున్నది.

బ్రిటిష్ సిబ్బందిని ఖాళీచేయవలసిన అవసరం ఇంకారాలేదనీ, ఒకసారి అవిధంగా చర్యతీసుకుంటే మళ్లీ దానిని మార్చుకొనే వీలు వుండదనీ ...

... రసీదుల విషయమై రాజీకి కొన్ని ప్రతిపాదనలను పరిశీలించారు.

పర్షియా ప్రధాని మొసాదిక్ అమెరికన్ రాయబారితో ఇటీవల సమావేశమయినప్పుడు ఆయన రాజీ అవసరమని సూచించారు. అమెరికన్ రాయబారి గిఫర్డు నిన్న ఆ సూచనలను బ్రిటిష్ విదేశాంగమంత్రికి, నూనె కంపెనీ అధికారులకూ తెలియజేశారు. మొసాదిక్ సూచన ఆమోదించబడితే నూనె రవాణాలో ఏర్పడిన ప్రతిష్టంభన తొలగిపోగలదు. అయితే ఆయన చేసిన ప్రతిపాదన లేమిటో మాత్రం తెలియటంలేదు. తీసుకున్న సరుకుకు డబ్బు చెల్లించే బాధ్యత తమకున్నదని టాంకరుల అధికారులు అంగీకరించవలెనని మొసాదిక్ ప్రతిపాదన సూచిస్తున్నట్లు తెలుస్తున్నది.

అయితే డబ్బు ఆంగ్లో ఇరానియన్ కంపెనీకి చెల్లించవలెనా, లేక పర్షియా జాతీయకంపెనీకి చెల్లించవలెనా అన్న విషయం ఉభయ కంపెనీల అర్థశాస్త్రాయిరిత్యా తేలేవరకూ నిలిపి ఉంచాలని ...

... బ్రిటిష్ ఆర్థికమంత్రి గెట్‌స్కెల్ నేడు వెల్లడించారు. బ్రిటిష్ ఆర్థిక పరిస్థితి వెనకటికన్నా మెరుగ్గా ఉన్నదని ఆయన అన్నారు.

పర్షియా పెట్రోలు లభించక పోవటంవల్ల అమెరికాకు చాల ఇబ్బంది కలగటం నిజమేకాని రేషనింగు ప్రవేశపెట్ట వలసిన అవసరం ఉంటుందని తాను భావించటం లేదని అమెరికా రక్షణ సన్నాహాల శాఖ డైరెక్టర్ విల్సన్ నేడు వాషింగ్టన్‌లో ప్రకటించారు.

పర్షియా నూనె వివాదాన్ని బ్రిటన్ ఐక్యరాజ్య సమితికి ప్రతిపాదించవలెనని పార్లమెంటులో లేబర్ సభ్యుడు ఫిలిప్స్ ప్రైస్ నేడు ప్రతిపాదించారు. విదేశాంగ ఉపమంత్రి డేవిస్ దానికి సమాధానమిస్తూ అంతర్జాతీయ న్యాయస్థానం ఐక్యరాజ్య సమితికి సంబంధించినదే నన్నారు.

### ప్రజలకు మొసాదిక్ విజ్ఞప్తి

నూనె ఎగుమతులవల్ల ఆదాయం పూర్తిగా నిలిచి పోయినట్లయితే తాను వారిని ధనం కోరవలసి వస్తుందని పర్షియా ప్రధాని మొసాదిక్ నేడు పర్షియన్ ప్రజలకు సూచించారు. నూనె టాంకర్ అధికారులు జాతీయ నూనె కంపెనీకి రసీదు లివ్వటానికి నిరాకరిస్తే ఆ పరిస్థితి తప్పదని ఆయన ...

## నూనె ధరలు తగ్గించడానికి పర్షియా ప్రభుత్వ నిర్ణయం

### నూనె రవాణాకు నౌకలు ఏర్పాటు చేయడానికి ఒక సంస్థ సూచన

టెహరాన్, జులై 5: నూనె కొనుగోలుదారులను ఆకర్షించడానికి ఇప్పటి ధరలకన్న నూటికి 8 వంతులు తక్కువగా నూనె విక్రయించనున్నట్లు పర్షియా ప్రభుత్వం ఈరోజున ప్రకటించింది.

ప్రతినిధుల సభలో ప్రసంగిస్తూ, అబడాన్‌నుండి ఇప్పుడే టెహరాన్ ...

... ఉద్యోగులు పర్షియా ప్రభుత్వం తరఫున పనిచేయుటకు నిరాకరించి పర్షియా వదలివెళ్లేటట్లయితే యితర విదేశీ నిపుణుల సహాయం పొందుటకు పర్షియా ప్రయత్నిస్తుంది. పర్షియాలోని నూనెగనులను నిర్వహించగల నిపుణులను పంపుటకు సిద్ధంగా నున్నామని ...

... గనులలో పని చేస్తున్న నిపుణాలు బ్రిటిషు ఉద్యోగుల స్థానే పంపబడెదరు.

## దేశాభివృద్ధికి ప్రథమ పంచవర్ష ప్రణాళిక

### ప్రజాభిప్రాయం తెలుసుకునేందుకు జులై 9 న ప్లానింగ్ కమిషన్ పథకముసాయిదా ప్రకటన

న్యూఢిల్లీ, జులై 4: ప్లానింగు కమిషన్‌వారు తయారుచేసిన పంచవర్ష ప్రణాళిక చిత్తుపాఠం జులై 9 సోమవారం నాడు ప్రకటితం కాగలదని తెలుస్తున్నది. ప్లానింగు కమిషన్ తాలూకు సలహా సంఘంవారు జులై 24 న సమావేశమై రెండు రోజులపాటు ఈ ప్రణాళికను పరిశీలిస్తారు.

## జీవితావసర వస్తువులపై అమ్మకపు పన్ను రద్దుకు ఆలోచనలు

### ఆగస్టులో పార్లమెంటులో బిల్లు ప్రతిపాదన

కలకత్తా, జులై 4: ప్రజల జీవితావసరాలకు అవసరమైన సరుకుల జాబితాను ఒకదానిని తయారుచేసి, ఆ సరుకులపైన కొనుగోలు పన్నుగాని, అమ్మకపు పన్నుగాని విధింపబడకుండా చూడాలని భారత ప్రభుత్వంవారు నిశ్చయించినట్లు తెలుస్తున్నది. ...

... వస్తు (4) పాలు, పాలసరుకులు; (5) ఉప్పు (6) వస్త్రాలు; (7) ఎరువులు, వ్యవసాయోపయోగ పనిముట్లు (8) ప్రత్తి, సెరుకు, జనపనార (9) రాకెన్ ... పెట్రోలు, విద్యుచ్ఛక్తి (గృహావసరాలకు) (10) ఇనుము, ఉక్కు.

## కొరియాలో పోరాటం నిలుపుదల

టోకియో, జులై 5: కొరియాయుద్ధరంగంలో అంతటా పోరాటం నిలచిపోయినదని అమెరికా అష్టమ సైన్య ప్రతినిధి ఒకరు నేడు ప్రకటించారు. కమ్యూనిస్టు సైన్యాల ప్రతిఘటన చాలవరకు తగ్గినదని కూడా ఆయన చెప్పారు.

## గంటల పంచాంగం

ఖర సం॥ ఆషాఢ శు॥ ద్వితీయ
1951 సం॥ జూలై 6 శుక్రవారం
శు॥ద్వితీయ సా6-46 పుష్య రా10-10
తే వర్జ్యం ఉ 6-8 వ.
శు॥ తృతీయ జూలై 7 శనివారం
శు॥ తృతీయ రా 7-37 ఆశ్లే రా 12-36
వర్జ్యం ప 12-16 ల 1-2 వ.

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర, యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ ఆషాఢ శు॥ ద్వితీయ
శుక్రవారం

## ముఖ్యమంత్రి సమీక్ష

రాష్ట్ర ఆహారస్థితినిగురించి ముఖ్యమంత్రి శ్రీ కుమారస్వామి రాజాగారు మొన్న ఆహార సలహాసంఘ సమావేశమునందు తెలిపిన విషయములనుబట్టి రేషనింగు, ధాన్య సేకరణలను విరమించిన ఆహార ధాన్యముల అందుబాటు స్థితి కొంత చక్కబడగలదను అభిప్రాయము కలుగును. తరుగు ప్రాంతములందు రేషనింగ్‌ను రద్దుచేసి, ధాన్యసేకరణను విరమించినతరువాత కొంత తేలికగ, తక్కువ ధరకు ఆహార ధాన్యములు లభించుచున్నట్లు శ్రీ కుమారస్వామిరాజాగారు ప్రకటించిరి. గత సంవత్సరము జూన్ మాసములో "పడి బియ్యము రూపాయిన్నర, రూపాయి ఎన్నండు అణాలు ఉండెడిది ఈ సంవత్సరము రూపాయి అయిదు అణాలకు మించి లేదు." అని ముఖ్యమంత్రి వివరములను వెల్లడించిరి ఈ మార్పుకు ప్రధాన కారణము రేషనింగ్, ధాన్య సేకరణలను విరమించుటే అయిన మిగులు ప్రాంతములందుకూడ ఇదే విధానమును అనుసరించిన పరిస్థితులు క్రమముగ చక్కబడవచ్చును.

1952 తరువాత ఆహార ధాన్యముల దిగుమతిఉండదని, 1951 పంటకాలము ముగియునాటికి భారతదేశము ఆహారధాన్యముల విషయమున స్వయం సమృద్ధము కావలెనని భారత ప్రభుత్వము అన్ని రాష్ట్రములకు లోగడ తెలిపియున్నను, తత్రాపి పరిస్థితులు విషమించి వర్షాభావమువలన, వరదల వలన పైరునష్టము కల్గినందున కేంద్రప్రభుత్వమే తొలినిర్ణయమును ఉపసంహరించుకొనెను. కేంద్ర ఆహారశాఖా మంత్రి శ్రీ కె. యం. మున్షీ గారును 1952 నాటికి ఆహారధాన్యముల అందుబాటుస్థితి చక్కబడగలదను ఆశాభావమును వెల్లడించిరి. విదేశములనుండి భారతదేశావసరములకు తగినంతగ ధాన్యము దిగుమతి కాగలదను నమ్మకము పంటదారులకు, వాడుకదారులకు కూడ కల్గించి గత రెండుసంవత్సరములుగ నున్న భయాందోళన తొలగి, అవాంఛిత పరిస్థితి యేర్పడకుండ ఉనుకూలముతో ధాన్యమును నిలువచేయుటను మానుకొనవచ్చును. రాష్ట్ర ముఖ్యమంత్రి కూడ ఇదే అభిప్రాయమును ప్రకటించిరి.

అయితే ఆహార ధాన్యోత్పత్తి అనుకున్నంతగ ఉండినను [illegible] ఆహార ధాన్యముల ధరలు ఇతర పంటల ధరలకంటె తక్కువగ నుండుటే ప్రధాన కారణమని వీరు అంగీకరించుటలేదు. పొగాకు, వేరుసెనగ, పసుపు, ప్రత్తి, జనుము మున్నగు వాణిజ్య పంటలకు ఉన్న ధరలు ఆహార ధాన్యములకు ఎన్నడు లేవు. పంట ధరలనుబట్టి రైతులు ఏ పైరు లాభసాటిగనుండునో చూచుకొని సాగుచేయుదురు. అట్టి దృష్టిరైతాంగమునకు ఉండుట సహజము. ముఖ్యమంత్రి హెచ్చరించినట్లు రైతులందర్ని నేరస్థజాతిగ పరిగణించుట అక్రమమె. ప్రభుత్వము నీటి పారుదల సౌకర్యములను కల్గించుటతో బాటు అన్నివ్యవసాయపంటలకు కనిష్ఠధరను నిర్ణయించి అమెరికాలోవలె ఆ ధర కు ప్రభుత్వము రైతులనుండి ధాన్యమును కొనకల్గిన ఏ పైరుకు భూమి ఎక్కువ అనుకూలముగ నుండునో, ప్రభుత్వము ఏ పైరుకు ధర పెట్టగల్గునో ఆ పైరునే రైతులు పండింపగలరు. ప్రభుత్వ విధానమునందు మార్పు అవసరమని గుర్తించి ఆరుమాసముల క్రితము తరుగు ప్రాంతములందు రేషనింగ్ ధాన్యసేకరణను రద్దుచేసినట్లు ముఖ్యమంత్రి ప్రకటించెను. అప్పటికంటెకూడ ఇప్పుడు ప్రభుత్వ విధానమున మార్పు అవసరము. ముఖ్యమంత్రి ఈ సమస్యనుకూడ శ్రద్ధగ విచారించి శీఘ్రముగ పరిష్కరింపవలసియున్నది.

## కాశ్మీరు సమస్య

### నెహ్రూతో గ్రాహం దీర్ఘ సంభాషణ

న్యూఢిల్లీ, జూలై 4: కాశ్మీరులో ఐక్యరాజ్యసమితిప్రతినిధి డా॥ ఫ్రాంక్ గ్రాహం నేటిసాయంకాలము ప్రధాని పండిత నెహ్రూగారిని దర్శించి వారితో దాదాపు ఒక గంట సేపు సంభాషించెను. ఈసంభాషణలలో డా॥ గ్రాహం సలహాదారు లిద్దరు, భారత ప్రభుత్వ విదేశీశాఖ కార్యదర్శి శ్రీ జి. ఎస్. బాజ్‌పాయ్ గారు పాల్గొనిరి. కపు డా॥ గ్రాహం మరల ప్రధానిని కలిసికొనును. నేటి ఉదయము డా॥ గ్రాహం విదేశాంగ శాఖ కార్యాలయంలో శ్రీ జి. ఎస్. బాజ్‌పాయ్‌గారిని కలిసికొని మాట్లాడిరి.

నేటి ఉదయము డా॥ గ్రాహం రాజఘాటలోని గాంధిమహాత్ముని సమాధిపై పుష్పగుచ్ఛముంచెను. ఈ 50 నిమిషాల సంభాషణలలో ప్రధాని కాశ్మీరు సమస్యపై వివరమైన చర్చలోనికి దిగలేదని, సమస్యపై భారత దేశ వైఖరిని మాత్రము డా॥ గ్రాహంకు తెలియజేసెనని యు. పి. ఐ. వారికి తెలుస్తున్నది. భారత ప్రభుత్వ మంత్రులు, అధికారులు డా॥ గ్రాహంను, వారి సలహాదార్లను కలిసికొంటారు. వారికి తగిన మర్యాద చేస్తారు. కాని డా॥ గ్రాహం రాయబారాన్ని గుర్తించారనే అభిప్రాయం కలిగించే పనులేమీ చేయరు. భద్రతా సంఘతీర్మానాన్ని ప్రాతిపదికగా పెట్టుకొని భారతప్రభుత్వంవారు చర్చలు జరుపరని తెలుస్తున్నది.

### పాకిస్థాన్ అధికార్లతో నిమ్మో సంభాషణలు

లాహోరు, జూలై 4: కాశ్మీరులో ఐక్యరాజ్యసమితి ప్రధాన సైనిక పర్యవేక్షకుడు మేజర్ జనరల్ నిమ్మో మంగళవారంనాడు పాకిస్థాన్ రక్షణ శాఖాధికారులను కలిసికొని కాశ్మీరు యుద్ధవిరమణ ఒడంబడిక ఉల్లంఘనకు సంబంధించిన సమస్యలను చర్చించెను. రావల్పిండిలో 24 గంటలుండి అచ్చటనుండి ఆయన వెళ్లిపోయెను.

### సరిహద్దున పాకిస్థానీ దాడులు
### ప్రొ॥ అబ్దుల్‌రహీం తీవ్రనిరసన

కలకత్తా, జూలై 4: సరిహద్దు సదాడులు చేసే కొందరు జాతులవారికి సహాయము చేసే విధానంవల్ల కలిగే ఉపద్రవమును పాకిస్థాన్ ప్రభుత్వదృష్టికి తెచ్చే ప్రకటనను ముస్లిమ్‌లీగు కార్యవర్గం ఏ. ఐ. సి. సి.ల మాజీ సభ్యుడైన ప్రొ॥ అబ్దుల్ రహీంగారు నేడు చేస్తున్నారు.

సరిహద్దు దాడులను ముమ్మరముచేయడం వల్ల ఇస్లామ్‌కే క్షతి కలుగుతుందని, మాలిక్‌గా పాకిస్థానుకు కలిగిన సర్వస్వాతంత్ర్య [illegible] భంగం కలుగుతుందని, ఆయన చెప్పుతున్నారు. 4½ కోట్ల భారతీయ ముస్లిముల క్షేమమును విచారించి ఈ సరిహద్దు సంఘటనల నాపివేయవలసిందని ఆయన పాకిస్థానును హెచ్చరిస్తున్నారు. ఢిల్లీ ఒడంబడిక ఉద్దేశ్యమును నెరవేరనీయకుండ [illegible] ఈ సరిహద్దు దాడులను, [illegible] సహించబోమని ఆయన చెప్పుతున్నారు.

## కమ్యూనిస్టు ప్రతిపాదన

(1-వ పేజీ తరువాయి)

"రాజకీయ విషయాలతో ఎట్టి సంబంధము లేదని జనరల్ ఒమార్ బ్రాడ్లీ గతిరాత్రి ప్రకటించారు.

కొరియా యుద్ధవిరమణకు అమెరికా సైన్యాధిపతుల వర్గంవారు జరుపుతున్న చర్యలలో ప్రతిసిధులసభ విదేశాంగ వ్యవహారాల సంఘం సంపూర్ణంగా ఏకీభవిస్తున్నట్లు ఆ సంఘాధ్యక్షుడు జేమ్స్ రిచర్డ్స్ నిన్న చెప్పారు.

### కేసాంగు సంభాషణలు

టోకియో, జూలై 5: కేసాంగులో జరిగే సంభాషణలలో పాల్గొనడానికి గాను సమితి సైన్యాలకు చెందిన ముగ్గురు లెయిజాన్ అధికారులు కింపో విమానాశ్రయంనుండి విమానంలోకాని జీపు కార్లలో కాని అక్కడికి వస్తున్నారు.

యుద్ధవిరమణకు సంబంధించిన వ్యవహారాలపై కాక ఇతర రాజకీయ విషయాలపై చర్చలు జరుపవద్దని జనరల్ రిడ్జివే పట్టుపట్టినట్లు సూచించుచున్నదని న్యూయార్కు పత్రికలలో వార్తలవల్ల తెలుస్తున్నది.

సమితిబలాలకు చెందిన ఒక గస్తీదళం ఈ రోజున కేసాంగులో ప్రవేశించినది. ఆ దళాన్ని కమ్యూనిస్టులు ప్రతిఘటించలేదు. కాని, కేసాంగుకు తూర్పుదిశనుండి నిన్న ఆ నగరంలో ప్రవేశించిన మరొక సమితి గస్తీ దళంపై కమ్యూనిస్టులు కతిపయ కాల్పులు జరిపిన కారణంచేత ఆదళం తిరోగమించినది.

కేసాంగు సంభాషణల ఫలితంగా 38 వ అక్షాంశరేఖ సరిహద్దుగా యుద్ధం నిలుపుచేయడానికి ఒడంబడిక కుదిరే పక్షంలో సమితి నిర్ణయాలను పాటించకుండా ఉండడానికి దక్షిణ కొరియా అధ్యక్షుడు సింగ్మన్ రీ నిశ్చయించాడట.

### పండిత నెహ్రూ వ్యాఖ్య

న్యూఢిల్లీ, జూలై 4: కొరియా యుద్ధవిరమణ ప్రతిపాదనపై వ్యాఖ్యానించమని కోరగా తాను చెప్పడానికి ఏమీ లేదని భారత ప్రధాని పండిత నెహ్రూ ఈరోజున విమానాశ్రయంలో అన్నారు.

కొరియా యుద్ధ విరమణ జరిగే అవకాశాలు ఏర్పడిన సమయంలో కూడా జాతీయ రక్షణ సన్నాహాలపట్ల జాగ్రత్తను నిర్లక్ష్యం చేయవద్దని పెకింగ్ రేడియో ఈ రోజున చైనా ప్రజలను ఉద్బోధించినది.

## కమ్యూనిస్టు రాజ్యాల వైఖరిలో మార్పు

### కొరియా యుద్ధవిరమణపై ఐసెన్‌హోవర్ వ్యాఖ్య

లండన్, జూలై 4: కొరియా యుద్ధ విరమణపై చర్చించడానికి కమ్యూనిస్టులంగీకరించారన్నది కమ్యూనిస్టు రాజ్యాల వైఖరిలో ప్రధానమైన మార్పు సూచిస్తున్నదని ఆశిస్తున్నట్లు అట్లాంటిక్ రాజ్యాల సైన్యాధిపతి జనరల్ ఐసన్‌హోవర్ నిన్న అన్నారు. ఇంగ్లీషు భాషా సంఘ వార్షిక సమావేశంలో ప్రసంగిస్తూ ఆయన పైవిధంగా చెప్పారు. ఈసమావేశానికి బ్రిటిషు ప్రధాని అట్లీ, విదేశాంగమంత్రి మారిసన్, ప్రతిపక్ష నాయకుడు చర్చిల్ హాజరయ్యారు. జనరల్ ఐసన్‌హోవర్ తన ప్రసంగంలో ఇట్లు చెప్పారు. వాస్తవంగా కమ్యూనిస్టు రాజ్యాల వైఖరిలో మార్పువచ్చినట్లయితే దానికి సమితిబలాలే కారణం. దక్షిణ కొరియాపై దురాక్రమణ ప్రతిఘటించటానికి సంవత్సరం కిందట మనం నిశ్చయించి యుద్ధంలోకి దిగినాము. కొరియా విషయంలో ప్రజాస్వామ్య రాజ్యాలు అవలంబించిన వైఖరి వల్ల పునందురాక్రమణను సహించమనే విషయం స్పష్టమైనది. ఇదే పూనికతో మరొక ప్రపంచ యుద్ధం రాకుండా నిరోధించటానికి మనం కృషిచేస్తున్నాము. ఇందుకై పశ్చిమ యూరపు రాజ్యాలు ఐక్యం కావాలి. యూరపు రాజ్యాల పటిష్ఠతి అట్లాంటిక్ సంధి లక్ష్యాలసాధనకు దోహదం చేస్తుంది. మన ఐకమత్యం పెంపొందించుకొన్నట్లయితే విజయం సాధించగలము."

## కలకత్తావద్ద కాందిశీకుల దౌర్జన్యం

### 80 మంది పోలీసులకు గాయాలు: 20 మంది అరెస్టు

కలకత్తా, జూలై 4: కలకత్తాకు 45 మైళ్లదూరములో రాణాఘాటు వద్దనున్న కాందిశీకుల శిబిరములో ప్రివెంటివ్ డిటెన్షను అక్టుక్రింద 7 మంది కాందిశీకులను పోలీసువారు అరెస్టు చేశారు. అందువిూదట ఆ శిబిరంలోని కాందిశీకులు ఆ పోలీసులపై తిరుగుబాటుచేసి దౌర్జన్యములు చేశారు. 80 మంది పోలీసులు గాయపడ్డారు. వారిలో 9 మందిని ఆస్పత్రిలో చేర్పవలసివచ్చింది. పోలీసులు తుపాకులు కాల్చిరి. ఈ కాల్పులో కాందిశీకులలో ఒకడు మరణించాడు. అతని శవముకోరకై శిబిరమంతా పోలీసులు వెతికించారు. కాని కన్పించలేదు. ప్రస్తుతము పరిస్థితి ప్రశాంతంగానే ఉంది. 275 సభికులు సోదా చేయబడెను.

### గౌ॥ శ్రీ చంద్రమౌళిగారు

స్థానికశాఖ మంత్రి శ్రీ చంద్రమౌళిగారు 9 తే రాత్రి మద్రాసు విడిచి 10, 11 రామేశ్వరం, 12 మధుర, 13 శ్రీవిల్లిపుత్తూరు చూచుకొని, 14 తేదీ మద్రాసు వస్తారు.

## రైల్వేసమ్మె వారించడానికి శ్రీసంతానం కృషి

### శ్రీ గురుస్వామికి సూచన

న్యూఢిల్లీ, జూలై 5: రైల్వే పనివారి తగాదా విషయంపై ప్రభుత్వ వైఖరిని స్పష్టంచేసే లేఖను రైల్వేశాఖ స్టేట్‌మంత్రి శ్రీ కె. సంతానంగారు అ. భా. రైల్వే ఫెడరేషనువారికి పంపియున్నారు. రైల్వే పనివారి సమ్మెను వారించడానికి యిది చాలావరకు తోడ్పడవచ్చును. సమష్టి సలహాసంఘంవారు పరిష్కరించని వివాదాలైనను సరే మధ్యవర్తి పరిష్కారానికి పంప ప్రభుత్వంవారు సిద్ధంగా వున్నారని లేదా ఆ తగాదాల విషయమై ఫెడరేషనువారితో చర్చింప సిద్ధంగా వున్నారని శ్రీ సంతానంగారు ఫెడరేషను కార్యదర్శి శ్రీ గురుస్వామిగారికి తెలిపినట్లు తెలుస్తున్నది.

కరువుభత్యాన్ని హెచ్చించాలనే కోర్కెను ప్రభుత్వంవారు మధ్యవర్తి పరిష్కారానికి పంపరు. ఎందువల్లనవగా ఈఅలవెన్సును పెంచగలస్థితిలో ప్రభుత్వంవారులేరు. ధాన్యం దుకాణాల సౌకర్యాన్ని విస్తరించాలనే సూచన కూడా రైల్వేబోర్డువారికి సమ్మతం కాకున్నది. రైల్వేపనివారే ఈ సౌకర్యానికి బదులు తమకు రొక్కం చెల్లించాలని కోరినారు. కనుక పాతిపద్ధతికి మరలే ప్రసక్తిలేదు. ధాన్యం దుకాణాల సౌకర్యాన్ని పొందుతున్నవారు దానికి బదులు రొక్కం పుచ్చుకొనుటకు అనుమతిస్తారు. సమష్టి సలహాసంఘం పరిష్కరించని యితర తగాదాలేమైనా వున్నయెడల వాటిని రైల్వేపనివారి ప్రతినిధులతో చర్చించడమో లేక వాటిని మధ్యవర్తి పరిష్కారానికి పంపడమో జరుగుతుంది.

## రాయిటర్సు వార్తాసంస్థ శతవర్షోత్సవం

లండను, జూలై 4: రాయిటర్సు వార్తాసంస్థ 1851 సం॥లో జూలియస్ రాయిటరు అనువానిచే నెలకొల్పబడుటకు పూర్వము బ్రస్సెల్సు నగరమునుండి సుమారు నూరుమైళ్ల దూరంలో ఉన్న ఆచెన్‌కు వ్యాపారధరల గూర్చిన వార్తలను పెంపుడు పావురములద్వారా తెప్పిస్తూ ఉండేవాడు అటువంటి రాయిటర్సు సంస్థ నేడు ప్రపంచములోనిఅన్ని ప్రాంతాలనుండి రేడియో వార్తాసాధనముల ద్వారా అతివేగంగా వార్తలను తెప్పించి పత్రికలకు సప్లయి చేయగలుగుతోంది. గత రెండో ప్రపంచ సంగ్రామకాలంలో కూడా కొన్ని సందర్భములలో పెంపుడు పావురాల పందెములువేసి పదు గెల్చిన యీ వార్తాసంస్థ వార్తలను తెప్పించియుండెను. ఈ సంస్థ నెలకొల్పబడి 100 సంవత్సరాలైంది. అందువల్ల బుధవారమునాడు లండను లోని ప్లీటు స్ట్రీటులోని రాయిటరు కార్యాలయమునుండి వందలకొలది పందెపు పావురాలు విడిచిపెట్టబడును. పెంపుడు పావురముల పందెములలో ఎవరిపావురము గెల్చునో వారికొక వెండిగిన్నెను విజేత బహుమానంగా యిచ్చునిమిత్తమై రాయిటరు వార్తాసంస్థలో సంపాదకులైన డబ్లియు. జోసువాన్‌గారికి రాయిటరు సంస్థ జనరలు మేనేజరగు క్రిస్టాఫరు చాన్సెలరుగారి జ్యేష్ఠకుమార్తెయగు మిస్ తెరెసా చాన్సెలరు కన్యచే బహూకరింపబడును.

## తాయిలాండులో తిరుగుబాటు

### సంపూర్ణంగా అణచివేయబడినదట

బాంకాక్, జూలై 4: తాయిలాండులో తిరుగుబాటు సంపూర్ణంగా అణచివేయబడినదని మేజర్ జనరల్ రార్చ కుంజరా గతిరాత్రి ప్రకటించారు.

నౌకా సైన్యదళం ఖయిదీగా పట్టుకున్న తాయిలాండు ప్రధాన మంత్రి ఫీల్డుమార్షల్ పిబుల్ సోంగ్రామ్ విడుదలకు తిరుగుబాటుదారులతో రాయబారాలు జరిపి, ప్రధాన మంత్రిని విడుదల చేయించినది జనరల్ కుంజరా.

తాయిలాండు నౌకాసైన్య పునర్నిర్మాణం జరుగుతున్నట్లు ఆయన చెప్పారు.

నౌకా బలాధిపతి ఫ్లీట్ అడ్మిరల్ లువాంగ్ సింధుసోంగ్రామ్, మరి 8 మంది వైస్ అడ్మిరల్సును బర్తరఫ్ చేయడంపై వ్యాఖ్యానిస్తూ, వారందరికి తిరుగుబాటు విషయం ముందే తెలిసినా దానిని నిరోధించలేక పోయారని జనరల్ కుంజరా ప్రకటించారు.

తిరుగుబాటుదారుల నాయకులందరు అధికారులకు లొంగిపోయినట్లు ఆయన చెప్పారు.

ఈలోగా ప్రధాన మంత్రి సోంగ్రామ్ విడుదలకు మహాసాహసంతో తోడ్పడిన ఒక పడవనడిపే వానిని కోసం ప్రధాన మంత్రి క్రింది అధికారులు అన్వేషణ సాగిస్తున్నారు.

### చైనాకు జపానునుండి యుద్ధపరికరాల ఎగుమతి

లండన్, జూలై 4: యుద్ధానికి పనికివచ్చే సరకులను ఎక్కువగా జపాన్ చైనాకు ఎగుమతి చేస్తున్నట్లు వచ్చిన వార్తలను బ్రిటిష్ విదేశాంగ శాఖ ఉపకార్యదర్శి ఎర్నెస్టు డేవిస్ ఈ రోజున ఖండించారు.

చైనాకు కొన్ని సరకుల ఎగుమతిని నిషేధించడంలో జపాన్ కూడా బ్రిటన్ జరిపిన చర్చలన్నిటినీ ఆమోదించినది అని ఆయన చెప్పారు.

## గుంటూరు జిల్లా ఆహార పరిస్థితి

### చక్కబడిందని కలెక్టర్ ప్రకటన
### రేషన్ కార్డులవారికి త్వరలో 8. ఔ. బియ్యం 4 ఔ. గోధుమ లభించవచ్చు

(స్వకీయ విలేఖరి)

గుంటూరు, జూలై 3: ఈ జిల్లా ఆహారపరిస్థితి సంతృప్తికరంగానే ఉన్నదని రేషన్‌కార్డులు గలవారికి త్వరలోనే 8 ఔన్సుల బియ్యము 4 ఔన్సుల గోధుమ యివ్వడం జరుగునని నిన్న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రసంగిస్తూ జిల్లా కలెక్టరు వైద్యనాథన్‌గారు ప్రకటించారు. "జిల్లా అంతటిలోను చాల కటువుగా నున్న వినుకొండ తాలూకా దక్షిణ గ్రామాలల్లో కూడ యిప్పుడు పరిస్థితులు కొంత చక్కబడ్డాయి. వ్యవసాయపు పని ప్రారంభము కావడంవల్ల కూలినాలీలకు నిరుద్యోగ సమస్యకూడ చాలవరకు తీరింది. జొన్న, రాగి మొదలగు ఆహారపదార్థాల ధరలు పెరగక అట్లాగ స్థిరంగా ఉన్నవి. అయినా కొంతకాలం పరిస్థితులు గమనిస్తూ ఉండాలి" అని అన్నారు. ఈ పట్టణంలో బియ్యం పంపకం తృప్తికరంగా లేదు. వారమునకు ఒక శేరు మాత్రమే స్టోర్సులో దొరుకుతున్నదని పత్రికా విలేఖరులు చెప్పగా "ఏ పట్టణంలోనూ సమస్య కొంత యిబ్బందిగానే ఉన్నది. ధాన్యపు నిల్వయున్నప్పటికీ 'బియ్యం పూల్సు' వారివద్ద తగినంత మూలధనం లేనందువల్ల వారు వారమునకు సరిపోయే బియ్యం ఒకే పర్యాయం కొనుటకు శక్తి లేకపోతున్నది. అందువల్ల ప్రజలు యిబ్బంది పడవలసి వస్తున్నది. పూల్సువారు తమ మూలధనమును యెక్కువ చేసుకోవాలి" అని సమాధానమిచ్చారు. వారానికి సరిపోవు ధాన్యాన్ని ఒక్కసారిగా ప్రభుత్వం కేటాయించుటం లేదని పూల్సువారు చెప్పుతున్నారే అని అడుగగా, ధాన్యపు నిల్వ లున్నప్పుడు వారివద్ద డబ్బుంటే యెందుకు కేటాయించరు? "పూల్సువారు ఒకటిరెండు మిల్లులు ప్రత్యేకంగా వారి కుపయోగపడేట్లు యేర్పాటు చేయమని కోరారు. కాని అది సాధ్యంకాదు. బియ్యం పంపకానికి యీ పూల్సుకన్నా హోలుసేలర్సు వుంటే ప్రభుత్వమునకు సుకరం. పూలు పద్ధతి రద్దు చేయాల్సి వస్తే హోల్‌సేల్ కోఆపరేటివ్ స్టోర్సునే హోల్‌సేలర్‌గా నియమించడం మంచిదని నా అభిప్రాయం" అని చెప్పారు. బియ్యపుకార్డు ఉన్నవారిలో చాలమందికి జిల్లాలో యెక్కడోఅక్కడ భూమి వుంటూనే వుంటుంది. వారువారి భూమినుండి ధాన్యం తెచ్చుకోవచ్చుకదా అని ప్రశ్నించగా జనాభా లెక్కలవల్ల తేలిన జనాభాకున్నూ, రేషను కార్డులవల్ల తేలిన జనాభాకు యెక్కడా సంబంధం లేకపోవడం చాలా వింతగా వుందనియు ఆ విషయమై కొంత పరిశీలన జరుగవలసి వున్నదన్నారు. గోధుమ అవసరమని భావిస్తే, రేషను షాపుల్లో గోధుమ పంపకానికూడ యేర్పాటు చేయుటకు ప్రయత్నిస్తామని వెల్లడించారు.

గుడ్డ నూలు పంపకం విషయం ప్రస్తావిస్తూ (1) నూలు పరిస్థితి అట్లాగాయున్నది. కాని గుడ్డ విషయంలో టోకు వర్తకులు గుడ్డ పంపకంలో గడువు తప్పిస్తున్నట్లు తెలుస్తున్నది. ఇది జిల్లాఅంతా విస్తృతం చెందుతున్నట్లున్నది. ఈ సమస్య సత్వరంగా పరిష్కారం కావాలి." అని కలెక్టరుగారు చెప్పారు.

## పోర్చుగల్ అధ్యక్ష అభ్యర్థికి సంఘర్షణలో గాయాలు

లిస్బన్, జులై, 4: పోర్చుగల్ అధ్యక్ష స్థానానికి పోటీచేస్తున్న అభ్యర్థి ప్రొఫెసర్ రైటాయి జ్ గోమెజ్ నిన్నరాత్రి ఒపోర్టోదగ్గర పోలీసులతో జరిగిన సంఘర్షణలో గాయపడ్డారు. జూలై 22 న జరిగే ఎన్నికకు పోర్చుగల్ డెమాక్రటిక్ నేషనల్ పార్టీ అభ్యర్థిగా ఈయన నిలబడ్డారు.

పోర్చుగీస్ ప్రభుత్వ హోం శాఖ నేడొక ప్రకటనచేస్తూ ప్రొఫెసర్ గోమెజ్ స్వల్పంగా గాయపడ్డారనీ, ప్రతికూలపక్ష ప్రదర్శకులు లేవదీసిన గొడవ్ని అణచి వేయటానికి వచ్చిన పోలీసులతో సంఘర్షణ జరిగి పదిమి జిల్లడించినది.

ప్రొఫెసర్ గోమెజ్ ఎన్నిక ప్రచారం నిమిత్తం ఏర్పాటుచేయబడిన సమావేశంలో ఉపన్యాసకులు ఆయన తరప్రపచారం చేయటంకన్నా ఎక్కువగా శాంతిభద్రతలకూ, న్యాయస్థానాలకూ అవమానకరంగా ప్రసంగించారు. ప్రభుత్వానికీ, సైన్యానికీ వారుచేసిన అవమానాన్ని చూసినమీదట ఈపద్ధతి మారకపోతే సమావేశాన్ని ఆపివేయవలసి వస్తుందని ప్రభుత్వ ప్రతినిధి హెచ్చరించారు. మొదట గోమెజ్ దానికి అంగీకరించలేదుగాని తరువాత ఒప్పుకున్నారు.

సభలో ఉన్నజనం వీధిలోకివచ్చి విగ్రహాలను కేకలు వేస్తూ పోలీసులమీద రాళ్లువిసరగా ఇద్దరుపోలీసులు గాయపడ్డారు. పోలీసులు దొమ్మీని అణచివేశారు. ప్రదర్శకులమధ్య ఉన్న ప్రొఫెసర్ గోమెజ్ స్వల్పంగా గాయపడ్డారు. అని ఆ ప్రకటన వివరించినది.

## ప్రభుత్వోద్యోగుల కర్తవ్యం

### పుల్లారెడ్డిగారి సలహా

మదరాసు, జులై 5: "కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు యిప్పుడు క్షేమరాజ్యం స్థాపించడానికి పూనుకొన్నవి. ప్రభుత్వం వారు ఆవిషయం గమనించి, మనమంతా యీ జాతీయ కార్యనిర్వహణమునందు భాగస్వాములుగా ఎంచి తోడ్పడాలి. సర్వీసకర్తలు విమర్శించి కృషి చెయ్యాలిగాని, అసంతృప్తికినక యుండరాదు." అని శ్రీ ఒ. పుల్లారెడ్డిగారు హోంశాఖ కార్యదర్శి నిన్న సాయంకాలం సెక్రటేరియటు సర్వీసెసు వారం సభయందు ప్రసంగిస్తూ చెప్పారు. ప్రభుత్వోద్యోగుల జీతాలు చాలవనే ఆందోళనకు కొంత కారణం లేకపోలేదు. కాని ప్రభుత్వానికి తగిన ఖర్చులు అపరిమితంగానున్నవని గుర్తించాలి. ఉద్యోగుల యిక్కట్లను, కోర్కెలను కార్పణ్యం లేకుండా వివరించాలని సలహా చేశారు.

సభకు మంత్రి బి. పరమేశ్వరనుగారు అధ్యక్షతవహించారు. ప్రజాప్రభుత్వం జయప్రదమగుట పరిపాలన సమర్థతపై ఆధారపడియుందని వారు అన్నారు. ఉద్యోగస్తులంతా కలిసి కట్టుగ పనిచేయాలి. వీలయినంతవరకు రూల్సు అనుసరించుతునే, వాటిని వ్యాఖ్యానించు నపుడు ఉదారంగా నుండి, రూల్సుప్రతిబంధకాలు కాకుండా చూచుకోవాలి. అని మంత్రిగారన్నారు.

పుల్లారెడ్డిగారు తమప్రసంగంలో, గుమాస్తాల స్వభావంగూర్చి లిఖింపబడే పెర్సనలుఫైల్సు, దిగువఉద్యోగులకు హాని కలిగించవనియు, వారి యోగ్యత తెలుసుకొనుటకు చాల తోడ్పడుచున్నవనియు చెప్పారు. ప్రభుత్వానికి అర్జీలు పెట్టుకునేవారు, న్యాయం కోరుచు విన్నవిస్తారుకనుక, వారి మనోభావంగ్రహించి, న్యాయం చేకూర్చుటకు ప్రయత్నించాలి గాని, ముక్కుసూటిగాపోయి రూల్సు ప్రతిబంధకంగానున్నాయనరాదు. రూల్సును అమలుజరుపునపుడు ఉదారంగ నుండాలన్నారు.

టి. పి. వెంకటరమణరావుగారు, సంఘ కార్యదర్శి, స్వాగతమిచ్చెరు. సంఘాధ్యక్షులు జె. ముత్తుపిళ్లెగారు వందనము లర్పించుటతో సభ ముగిసింది.

### ఇంజినీరింగ్ కాలేజీ సెలక్షన్ కమిటీ పునర్నిర్మాణం

మద్రాసు, జూలై 5: శ్రీ సి. కృష్ణస్వామి చెట్టి స్థానే రిటైర్డు సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ టి. శేఖరన్ (కోయంబత్తూరు) ను ఇంజనీరింగ్ కాలేజీ సెలక్షన్ కమిటీ సభ్యుడుగా ప్రభుత్వంవారు నియమించారు. మొదట్లో సభ్యుడుగ నియమించబడిన శ్రీ కృష్ణస్వామిచెట్టిగారు కమిటీలో వుండనిరాకరించారు. కమిటీలో మరొక సభ్యుడు ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు డా॥ వి. యస్. కృష్ణా.

రాష్ట్రము మొత్తముమీద ఇంజనీరింగు కళాశాలలోని 400 సీట్లకు 2000 దరఖాస్తులు, వైద్యకళాశాల సీట్లు 400 కు సుమారు 2 వేలు పైటర్నరీ, వ్యవసాయకళాశాలలలోని 194 సీట్లకు 5 వందల దరఖాస్తులు వచ్చినట్లు తెలుస్తోంది:

సెలక్షన్ కమిటీ నేటినుండి పని ప్రారంభించినట్లు కూడ తెలుస్తోంది.

### చెర్యుగర్భాల్లో భవన నిర్మాణం

#### ముఖ్యమంత్రి వద్దకు శ్రీ గౌతు లచ్చన్న రాయబారం

మదరాసు, జూలై 5: శ్రీ గౌతు లచ్చన్న యం. యల్. ఎ. విశాఖజిల్లా కిసాన్ సమితి అధ్యక్షుడు శ్రీ వి. వి. రమణ నేడు ముఖ్యమంత్రి శ్రీ కుమారస్వామిరాజాగారిని చూచి అనకాపల్లి చెర్యుగర్భంలోని భూములను కో-ఆపరేటివు భవన నిర్మాణమునకు దఖలు చేయుటవలన చాలామంది బీదవారి జీవనోపాధి పోతోందనియు, అవసరమైనచో మునిసిపల్ సరిహద్దులను పెంచి, గృహనిర్మాణం కొనసాగించవలెననీ సూచించారు.

ఈ సందర్భమున వీరు డెవలప్‌మెంటు కార్యదర్శిని, కో-ఆపరేటివు రిజిస్ట్రారును చూశారు. నిన్న ఈ విషయమై రాష్ట్ర ఆహార సలహాసంఘ సమావేశంలో ప్రస్తావించినట్లు కూడా తెలుస్తోంది.

### ఉపాధ్యాయులు ట్యూషను చెప్పే నియమాలు

సెకండరీ స్కూళ్ల ఉపాధ్యాయులు ప్రయివేటు ట్యూషను చెప్పే నియమాలు ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయులకు కూడ వర్తింపచేస్తు ప్రభుత్వంవారు ఉత్తరువు చేశారు. ఈ దిగువ షరతులపై ఉపాధ్యాయులు ట్యూషను చెప్పవచ్చును. — ఒకనెలలో 8 విద్యార్థులకు వారానికి 12 గంటలుమించి ట్యూషను చెప్పరాదు. అందు 4 గంటలు సెలవు దినములందు ఉండాలి. విద్యార్థుల పేర్లు, చెప్పే గంటలు హెడ్‌మాస్టరుకి తెలియజేయాలి. విద్యార్థుల పరీక్షా పత్రాలు దిద్దే యేర్పాటు స్కూలు అధికారులుదాని బట్టి నిర్ణయించాలి. ప్రయివేటు వేళలకు అద్దె రాకూడదు. స్కూలు అనుమతి లేనిది ఎవ్వరూ ప్రయివేటు ట్యూషను అంగీకరించరాదు.

## తాతా కంపెనీ షేర్ల వ్యవహారం

### మధ్యవర్తి శ్రీ సెతల్వాడ్ సూచన

బొంబాయి, జూలై 4: తాతా కంపెనీ షేర్ల వాటాలను ఆర్డినరీ వాటాలుగా మార్చగల సావకాశం నేటి సాయంత్రం పొడచూపింది.

భారతదేశం అటర్నీ జనరల్ శ్రీ ఎం. సి. సెటల్వాడ్ ఈ సూచనతోపాటు, ప్రతిరకం వాటాదార్లు కలుసుకొని, రెండు కమిటీలుగా ఏర్పడి, తమ తమ అభిప్రాయాలు ఏమిటో నివేదించుకోవచ్చునని సూచించారు. ఈ రెండు రకాల వాటాదార్లు అయన్ను మధ్యవర్తిగా ఎంచుకున్నారు.

తిరిగి సమాలోచనలు జూలై 15 న ప్రారంభం అవుతాయి.

### బీజాపూరు 'గోల్‌గుంబజ్'

బొంబాయి, జూలై 4: మరామత్తులకుగాను కొద్ది మాసాలుగా ప్రేక్షకులకు మూసివేయబడి యుండిన బీజాపూరు 'గోల్ గుంబజ్' తిరిగి యథాప్రకారంగా ఇప్పుడు తెరవబడినట్లు ప్రకటింపబడింది.

### మదరాసు కాంగ్రెసు సంఘం సూచనలు

మదరాసు జిల్లా ఆంధ్ర కాంగ్రెసు సంఘం పంచాయితీ సభ్యులు 4 తే. సభచేసి, రానున్న ఎన్నికలలో నూటికి 60 మంది నైన క్రొత్తవారిని యువకులను శాసనసభలకు అభ్యర్థులుగా నియమించే యేర్పాటుచేయాలని కాంగ్రెసు అధికారులకు సూచించేరు. బెంగుళూరులో జరుగు అ. భా. కాం. సంఘ సభయందు డా॥ కె. వి. స్వామిగారు, జిల్లా సంఘ కార్యదర్శి యీ తీర్మానం ప్రతిపాదిస్తారు.

ప్రభుత్వోద్యోగులకు కేంద్ర ప్రభుత్వం యిస్తున్న రేటు జీతాలు యివ్వాలని, దక్షిణాదిని ఎక్కువ ఎలక్ట్రిక్ స్కీములు ప్రాజక్టులు నిర్మించాలని, భాషా ప్రయుక్త రాష్ట్రాలు నియమించాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతు అ. భా. కాం. సంఘంలో తీర్మానించుటకు డా॥ స్వామిగారిని కోరిరి. సభ డా॥ స్వామిగారి అధ్యక్షతను ట్రిప్లికేనులో నున్న జిల్లా కాంగ్రెసు కార్యాలయమునందు జరిగెను.

మదరాసుజిల్లా కాంగ్రెసు సంఘం ఎన్నికలు జరిపించడానికి ఎలక్షను ఆఫీసరుగ యం. హనుమంతరావుగారు (నెల్లూరు) రాష్ట్ర కాంగ్రెసు సంఘంచే నియమింపబడ్డారని, పంచాయితీ మెంబర్లలో యిప్పుడేమి ఖాళీలు లేవని డా॥ స్వామిగారు చెప్పారు.

### రాయపేట శాంతిసంఘం

మైలాపూరు కపాలీటాకీసు దగ్గర మైదానంలో 6వ తే. సా. 5-30గ. టి. ఎం. రామస్వామిగారి అధ్యక్షతను సభ జరుగును. వి. రాధాకృష్ణను, ఎం. పచ్చియప్పను, ఎన్. వి. నటరాజను మున్నగువారు శాంతిస్థాపన గూర్చి ఉపన్యశిస్తారు.

అంబత్తూరు శాంతి ఆశ్రమమునందు జూను 26 నుండి జులయి 2 తే. వరకు సాహిత్య అలంకార రఘునాధాచారిగారు శ్రీ మద్వాల్మీకి రామాయణము హరికథ చెప్పిరి. పట్టాభిషేకంనాడు శాంతి సుబ్రహ్మణ్య స్వామివారు వారికి 'ఉపన్యాస రత్నం' అను బిరుదిచ్చారు.

### కావలి ఆస్పత్రి

కావలి ప్రభుత్వ ఆస్పత్రిలో నాల్గు మంచాలుగల స్త్రీలవార్డు కట్టించి మంచాలు యితర పరికరాలతో కూడా యివ్వదలచిన శ్రీమతి అడపా పిచ్చమ్మగారి సూచనను ప్రభుత్వమువారు కృతజ్ఞతతో అంగీకరించారు.

పార్లమెంటు డిప్యూటీ స్పీకరు ఎం. అనంతశయనం అయ్యంగారు 7 తే సా 6 గం గోఖలేహాలులో "ప్రస్తుత రాజకీయ పరిస్థితులు, మన కర్తవ్యం" గూర్చి ఉపన్యశిస్తారు.

### కాకినాడకు గౌ॥ తిరుమలరావుగారి రాక

కాకినాడ, జూలై 4: కేంద్రఆహారశాఖ ఉపమంత్రి గౌ॥ శ్రీ మొసలికంటి తిరుమల రావుగారు, నిన్నటిరోజున యిక్కడకు విచ్చేశారు. రహదారి బంగళాలో మకాం చేసియున్నారు. కాకినాడరేవు అభివృద్ధిని గురించి, కోరంగి ప్రాజెక్టునుగురించి వర్తకులతోనూ, రైతులతోనూ, ఉద్యోగులతోనూ చర్చలు జరిపారు. (స్వ. వి.)

## బ్రిటిష్ నూనె నౌకల ఈజిప్టు నిర్బంధాలు

### న్యాయ సమ్మతమని విదేశాంగమంత్రి ప్రకటన

కెయిరో, జూలై 4: సూయజ్ కాలువగుండా హైఫావెళ్ళే నూనె నౌకలపై ఈజిప్టుప్రభుత్వం విధించిన నిర్బంధాలు న్యాయసమ్మతమైనవని విదేశాంగమంత్రి సాలా ఎల్ దీన్ పాషా నేడిక్కడ చెప్పారు.

ఈజిప్టు నిర్బంధాలపై అమెరికా, బ్రిటన్‌లతోకలిసి 10 రాజ్యాలు ఆక్షేపణలు తెలియపరచినవి. ఆ ఆక్షేపణలపై వ్యాఖ్యానిస్తూ విదేశాంగమంత్రి ఇలా ప్రకటించారు:—

"ఇజ్రేల్‌తో ఈజిప్టు యుద్ధం ఇంకా ముగియలేదు."

### పర్షియారాజుకు శస్త్రచికిత్స

టెహరాన్, జూలై 5: పర్షియా రాజు మహమ్మదురెజాపహ్లవీకి ఈ రోజున ఇక్కడి ఆస్పత్రిలో శస్త్రచికిత్స చేశారు. న్యూయార్కులోని ఒక ఆస్పత్రిలో ప్రధాన శస్త్రవైద్యుడుగా పనిచేస్తున్న డాక్టర్ ఫ్రాంక్ గ్లెన్ పర్షియా రాజుకు శస్త్రచికిత్స చేశారు.

శస్త్రచికిత్స విజయవంతంగా జరిగినట్లు రాజభవనాధికారులు చెప్పారు.

### బ్రెడ్ రేషను

మదరాసు, జూలై 5: చన్న రాష్ట్రములో మొత్తం రేషను ప్రమాణం జూను 24 నుండి 9 ఔన్సులనుండి 12 ఔన్సులకు పెంచినందున, జాను రొట్టెరేషను గైకొనువారికి దినమునకు 12 ఔన్సుల బ్రెడ్డుకి బదులు 1 పౌను యివ్వాలి. కనుక యికముందు 6 ఔన్సుల రొట్టెలకు బదులు 8 ఔ॥ రొట్టెలను తయారు చేయవలసి యుండును. దానికి దిమ్మలు అవి తయారు చేయుటకు వ్యవధి కావాలి కనుక, జులయి 8 నుండి ఆసైజు రొట్టెలను తయారు చేయాలని రొట్టెలు తయారు చేయు కంపెనీలకు ఉత్తరువు చేశారు. ఈలోగా రేషను దుకాణాలందు 8 యూనిటుల ధాన్యాలకు 4 యూనిట్ల బ్రెడ్డు టిక్కెట్లు యిమ్మని ఉత్తరువు చేశారు.

## పెట్రోలు వాడకం

### కంట్రోలు ఇప్పుడు ఉండదని ప్రభుత్వం ప్రకటన

న్యూఢిల్లీ, జూలై 4: దేశంలో పెట్రోలు కొరత ఏర్పడినంతవరకు ప్రభుత్వంవారు దాని వాడకంమీద ఎట్టి నియమాలను పెట్టదలచుకోలేదు.

భారత పర్కున్న శాఖవారు నేడీ విషయాన్ని వెల్లడిచేస్తూ, దేశంలో ఇప్పుడు పెట్రోలు నిల్వలు తృప్తికరంగా వున్నాయని, దాని సరఫరా తగ్గనూచనలు కన్పించేవరకు రేషనింగు అనవసరమని ప్రభుత్వంవారు భావిస్తున్నారని ఒక ప్రకటన చేసారు.

### ఢిల్లీ మార్కెట్ ధరలు

బన్సీధర్ మరియా మల్, సుగంధద్రవ్యముల కమిషన్ ఏజెంట్లు ఖడీబోలియా మార్కెట్టు, ఢిల్లీ.

ఢిల్లీ, జూలై 3: 84½ తూనికలు మణుగు 1 కి ధరలు మిరియాలు 585-0-0, లవంగాలు 275-0-0, దాల్చిన చెక్క 115-0-0, కాంప్ట్ 171- ఏలకులు- మహారి 196, 198 దక్కన్ (శేరు 1-½) రు. 30, 34 వక్కలు- పెకాంగ్ (మణుగు 1-½) 100-0-0. వింగళం 94 మంగుళూరు 120-0-0. జాజి 90,92. పసుపు-సంగ్లీ 42-0-0. ఈరోడ్ 37, 43. నిజామాబాద్ 35, దుగ్గిరాల 36-0-0. గద్వా 33, 35. కడోరి 74 కొబ్బరి—ఉత్తర 94,100. భగళవియ్యం 43-0-0 పెసరకాయలు 90- రెండులకర్ర 60, 85, ధనియాలు,చిన్నవి- 95-100, పెద్దవి అల్లాలు 80-90, మాల్యా 38-0-0 కర్బూజ 42, 50 పోస్త 55, 70. మెంతులు 30-0-0 మామిడవడుగు 40, 60, పెపాస్టిక్ సూర్ మార్కు 38-0-0, బాదం150.154. కిస్‌మిస్ 112-0-0 జీడిపప్పు 170-0-0-175-0-0

### హైదరాబాదు (ఉస్మాన్‌గంజ్) మార్కెటు ధరలు

(సప్లయిదారు గువ్వా అప్పయ్య గారి వెంకటేశం)

హైదరాబాదు, జూలై 5: బంగారం తులం 1 కి 130-0-0 ; వెండి 100 కు 222-0-0.

పల్లీ ఒకటికి పసుపు 80.85 పెసలు 66-67. కందులు 54-58. మినుములు 85-0-0 కందులు 62-0-0 ఉలవలు 49-0-0 కందిపప్పు 73-0-0 కందిపప్పు చిన్నది 69-8-0, పెసరపప్పు 84-0-0 మినపపప్పు 122-0-0 వేరుశెనగపప్పు 120-0-0 ఆముదాలు 101 చింతపండు 40-50, మిర్చి 160-200 జనుములు 72-0-0 ధనియాలు 16[illegible] శెనగలుగు 36-0-0 ఆవాలు 15-17 ఎల్లిగడ్డ[illegible] వడ్ల 1 కి 30-35

### బొంబైవెండిబంగారుమార్కెట్

బొంబై, జూలై 5: నేటి మధ్యాహ్నం 2 గం॥కు బొంబైవెండి బంగారు మార్కెట్ ధరలు : వెండి (100 తు) రు 193-10-0; బంగారం (తు 1 కి) రు 112-7-0; సావరిన్ 1 కి 77-0-0.

## దక్షిణాది నదీజలముల వినియోగం

### కృష్ణాపెన్నార్ ప్రాజక్టు పరిశీలన

మదరాసు, జూలై 4: కృష్ణా పెన్నార్ ప్రాజక్టు గురించి సమగ్రపరిశీలన జరుగుతోంది. ఇదేగాక రామపాదసాగర్ ప్రాజక్టు కూడా పరిశీలనలో వుందని ప్రభుత్వమువారు నేడు రాష్ట్ర ఆహారసలహా సంఘానికి తెలియజేశారు.

రామపాద సాగర్ ప్రాజక్టు ను సంస్కరించుట గురించి చీఫ్ ఇంజనీరు, సెంట్రల్ ఇరిగేషన్ బోర్డుకు చెందిన శ్రీఖోస్లాతో సంప్రదిస్తూ వున్నారని కూడా ప్రభుత్వమువారు తెలియజేశారు.

ఇవేగాక ప్రభుత్వమువారు త్రైవర్షప్రణాళిక క్రింద చిన్న చిన్న స్కీములు 300 లను అమలు జరుపుటయే గాక స్పెషల్ ఇంజనీరు యాజమాన్యమున చెరువుల మరమ్మతు కు సంబంధించిన పంచవర్ష ప్రణాళికను నిర్వహిస్తూ వున్నారు.

భూగర్భ నీటిజలల పరిశీలన జరిగిందనియు పరిశీలన ఫలితం తెలియగానే అనంతరచర్య తీసుకొనెదరని చెప్పారు. 1948 లో 21 స్కీములను 1950 లో 101 ఆర్టీజియన్ వెల్సు స్కీమును మంజూరు చేశారని ఈ స్కీమును తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలకు వర్తింపజేయుట గురించి ప్రభుత్వమువారు యోచిస్తూ వున్నారని కూడా సలహాసంఘానికి తెలిపారు.

### విశాఖజిల్లాకు నీటి వసర్లు

### 5 స్కీములు మంజూరు

మదరాసు, జూలై 4: అధికాహారోత్పత్తికిగాను ప్రభుత్వము త్రైవర్ష ప్రణాళిక క్రింద విశాఖ జిల్లాలో 5 స్కీములను మంజూరు చేసింది. అవి (1) ముఖలింగం వద్ద వంశధార నీటి పంపిణీ అభివృద్ధి (2) పరుగుడు గట్టుమీద కట్టవేపు డాము నిర్మాణము (3) కొల్లిపల్లివద్ద గోస్తనీ నదిమీద ఆనకట్ట నిర్మాణము (4) గోకివాడ గెడ్డదిగువ కట్టమీద స్లూయజ్ నిర్మాణం (5) దబ్బ చెరువు అభివృద్ధి.

### సహకారోద్యమం ద్వారా అధికాహారోత్పత్తి

మదరాసు, జూలై 4: అధికాహారోత్పత్తి సాధనకొరకు ప్రభుత్వం ఏడు జిల్లాలలో గ్రామ సహకారసంఘము లను ఏర్పాటు చేసింది. ఈ స్కీమును ఇతర జిల్లాలకు కూడా పెంచుటకు ప్రభుత్వం పరిశీలిస్తోంది.

### కొరవ జిల్లాలలో సేకరణ

### కలెక్టర్లకు వుత్తర్వులు

మదరాసు, జూలై 4: కొరత జిల్లాలలోకూడా అయిదు లేక పది యకరాలకు మించి భూమి వున్న అసాముల నుండి సహకారసంఘాలు నమ్మకమైన వర్తకుల ద్వారా కొన్ని జొన్నలను సేకరించాలని కలెక్టర్లకు ప్రభుత్వము వారు వుత్తర్వుచేశారు.

### సంఘ శ్రేయానికి హానికలుగ జేసే నేరస్థులయెడ చర్య

మదరాసు, జూలై 4: దొంగ వ్యాపారం మున్నగు సంఘ హానికరమైన నేరాలను చేసేవారికి ఆ కేసులలో నేరం తీవ్రతె మున్నగు అంశాలను ఆలోచించి సమయానుసారం అవసరమైనపుడు అట్టి నేరస్థులకు కారాగృహశిక్ష విధించాలని కోర్టు వారిని పబ్లిక్ ప్రాసిక్యూటర్లు కోరవలసిందని ప్రభుత్వం ఆదేశించియున్నది. దొంగ వ్యాపారస్థుల విషయంలో ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టముక్రింద కూడా అవసరమైతే చర్య తీసుకొనటానికికూడా ఆస్పదము కలదని ఆహార సలహా సంఘ సభలో ఒక ప్రశ్నకు సమాధానముగా ప్రభుత్వంవారు తెలిపారు.

### గుజరత్ రైతుసంఘ నిర్ణయం

### రంగాగారి ఆమోదం

మదరాసు జూలై 4: గుజరత్ ఖేడుట్ (కిసాన్) సంఘ కాంగ్రెస్ నుండి విడిపోయి స్వయం ప్రతిపత్తిగల ప్రత్యేకసంస్థగా నుండటానికి గావించియున్న తీర్మానము గూర్చి ప్రొ. యన్. జి. రంగాగారు యీ వాళ తమ ఆమోదం తెలిపారు. భారతదేశములో గల అన్ని కిసాన్ సంఘాలు ఢిల్లీలో భారతకిసాన్ సమ్మేళనం జరిగి భవిష్యత్తును నిర్ణయించుకునే వరకు యుద్దేశ్యప్రకారం తమప్రత్యేక స్థాయిని నిలబెట్టుకుంటూ యేయితర రాజకీయపార్టీతో గాని కలియకుండడం ఉత్తమముగా నుంటుందని కూడా వారు అభిప్రాయం ప్రకటించారు.

భారతకిసాన్ సమ్మేళనం ఆగస్టు 4, 5 తేదీలలో ఢిల్లీయందు జరుగునని ఆ సమావేశంలో రాబోవు జనరల్ ఎన్నికల విషయంలో కిసాన్ సంఘాలు యేవైఖరిని అవలంభించవలెనో సంగతి గూర్చి ముఖ్య నిర్ణయములు జరుగునని కూడా వారు తెలిపారు.

రంగాగారు విజయవాడ నుండి యీవాళ ఉదయం మదరాసు వచ్చారు. ఆయన నగరంలో రెండు రోజులు ఉంటారు.

### రంగాగారి పర్యటన

### కార్యక్రమం

విజయవాడ, జూలై 5: ప్రజాపార్టీ నిర్మాణ సందర్భంలో ఈ 7 వ తారీఖును తాలూకాలోనూ 8, 9 లలో విశాఖపట్టణం జిల్లాలోనూ, 10 మొదలు 14 వరకు శ్రీకాకుళం జిల్లాలోనూ పర్యటిస్తారు.

## కాన్పూరులో పెద్ద మిడుతల దండు

కాన్పూరు, జూలై 3: నేడు దయము పెద్ద మిడుతలదండు కాన్పూరునకు వచ్చెను. ఇది ఉత్తర దిశనుండి వచ్చి తూర్పు వైపునకు పోయెను. ఈ మిడుతలదండు సుమారొక మైలు పొడుగున విస్తరించి యుండెను. 2 గం సేపు చెట్లమీదను, ఇండ్ల కప్పులమీదను పొలాలమీదను ఆవరించి వెడలిపోయెను. గత 20 ఏండ్ల యీ మధ్య కాలంలో యింతటి మిడుతలదండు ఎప్పుడూ కాన్పూరులో సంభవించలేదు.

300 గ్రామాలలోని నిలువు పైరులకు విపరీతమైన నష్టము కలుగజేసెనని యు కాన్పూరుజిల్లాలోని భవానీపూరు తాలూకాలోని పంట యావత్తు ధ్వంసమైనదనియు జిల్లా కలెక్టరు నేడు ప్రకటించెను. మిడుతలదండును సంహరించుటకై క్రిమిహారక రసాయన ద్రవ్యములను ప్రయోగించెడి యంత్ర సాధనములను అధికార్లు వెంట వేతెప్పించాలి. గ్రామాలలోని జనులు చీపురు కట్టలు చేతబట్టి మిడతలనుపారదోలి చంపివేయసాగిరి.

### ఆసియా దేశాలలో రోడ్లు

వాషింగ్టన్, జూలై 3: దక్షిణ ఆసియా రాజ్యాలలోను, సమీప ప్రాచ్యరాజ్యాలలోను, లాటిన్ అమెరికా దేశాలలోను రోడ్లను నిర్మించడంలో సహాయం చేయగలందులకు అమెరికా, అంతర్జాతీయ రోడ్డు కార్పొరేషన్ తో ఒక ఒడంబడిక చేసుకొన్నది.

ఈ ఒడంబడిక అమెరికా అధ్యక్షుని చతుర్సూత్ర ప్రణాళికలో అతి ముఖ్యమైనవిషయంగా హెన్రీ బెన్నెట్ పేర్కొన్నారు. ఈ బెన్నెట్ ఈ కార్యక్రమణ నిర్వాహకుడు.

### కాంగ్రెసునుంచి రాజీనామలు

బెంగుళూరు, జూలై 3: ఈఊరి కాంగ్రెసు వాదుల్లో 80 మంది తమ కాంగ్రెసు సభ్యత్వాలకు నేటిదినం రాజీనామా యిచ్చారని తెలుస్తున్నది. ఆ యిచ్చినవారిలో బెంగుళూరు జిల్లా కాంగ్రెసు కార్యదర్శి, మైసూరు ప్రదేశ కాంగ్రెసులోని యిరువురు సభ్యులుకూడా ఉన్నారు.

ఈసారి జరగబోయే ప్రదేశ కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గ సమావేశంలో ఈ రాజీనామాల విషయం చర్చింప బడుతుందని తెలుస్తున్నది.

### కృష్ణాజిల్లా మద్యనిషేధ సలహాసంఘ సమావేశం

బందరు, జూలై 2: కృష్ణాజిల్లా మద్యనిషేధ సలహా సంఘ సభ్యుల సమావేశం గత శనివారంనాడు చిలకలపూడిలోని జిల్లా కలెక్టరు కార్యాలయంలో జరిగింది. సభకు జిల్లా కలెక్టరు పి. ఎం. నాయక్ గారు అధ్యక్షత వహించారు. ఈతచెట్లకు గీతగీసి ఆ కల్లుతో బెల్లం తయారుచేసే విషయం చర్చకు వచ్చింది.

బెల్లంతయారీకి ఈతచెట్లను గీయటం ఆపుదల చేయమని ప్రభుత్వాన్ని కోరవలసిందిగా జిల్లా కలెక్టరుగారిని జిల్లా మద్యనిషేధ శాఖాధికారిగారు కోరారు. గడచినసారి 20 వేల తాటిచెట్లు గీసారనీ, ఒక చెట్టుకు 1మణుగు చొప్పున తాటిబెల్లం తయారు కావలసివుంటెగా మొత్తం 945 మణుగుల బెల్లం మాత్రమే లెక్కకు వచ్చిందనీ, మిగిలిన కల్లంతా దుర్వినియోగమైనదనీ తెలియచేశారు. తియ్యకల్లు వుత్పత్తికి గాను ఒక్క గ్రామంలో ఈతచెట్ల గీత జరుగాలనీ, తద్వారా బెల్లం వుత్పత్తిని కొనసాగించాలనీ సభవారు తీర్మానించారు. (స్వ. వి.)

### నర్సరావుపేటలో వైశ్య విద్యార్థినిలయ ప్రారంభం

నర్సరావుపేట, జూలై 1: స్థానిక వణిక్ ప్రముఖుడు తాడేపల్లి వెంకట నారాయణ శ్రేష్టిగారు రు. 60 వేలు వెచ్చించి నిర్మించిన వైశ్య విద్యార్థి నిలయాన్ని గత 28 న రిటైర్డు కలెక్టరు ఎస్. విరూపాక్షి శెట్టిగారు ప్రారంభించారు. ఆ సందర్భంలో ఏర్పాటైన సభకు కాసు బ్రహ్మానందరెడ్డి ఎం. ఎల్. ఎ. గారు అధ్యక్షత వహించారు. వెంకట నారాయణ దంపతుల రూప చిత్రాలను చీమకుర్తి కుమారస్వామిగారు ఆవిష్కరించారు. వి. కోట్లింగం, ఎన్. హనుమంతరావు, ఎస్. సుబ్బరాయశ్రేష్ఠి ప్రభృతులు వుపన్యసించారు. కార్యదర్శి కె. వెంకటరత్నం గారు నివేదికను చదివారు. వందనాలతో సభముగిసింది.

### శ్రీకాకుళం బస్సుప్రయాణీకుల నివేదిక

శ్రీకాకుళం, జూన్ 27: ఈ జిల్లా బస్సుప్రయాణీకుల సంఘాధ్యక్షుడు ఎర్రమిల్లి రాజశేఖరరావుగారు ప్రాంతీయ రవాణా శాఖాధికారిని నిన్న సాయంకాలం కలుసుకొని బస్సు ప్రయాణీకుల యిబ్బందులను వివరించారు. బస్సులు సకాలంలో బయలుదేరునట్లు చేయగలమనీ, అవి బయలుదేరే కాలాలు, చేరే స్థలాలు, వసూలుఅయ్యే చార్జీలు వివరించే బోర్డులు స్టాండులలో పెట్టించగలమనీ అధికారిగారు చెప్పారు. రైల్వేస్టేషను నుంచి పట్టణంలోకి సిటీబస్సులు మరి కొన్ని వేయమనికూడా రాజశేఖర రావుగారు కోరిఉన్నారు. (స్వ. వి.)

## అంతర్జాతీయ సోషలిస్ట్ మహాసభ

### తృతీయ సంగ్రామ నివారణకు ఆయుధ సజ్జీకరణ అవసరమని తీర్మానం

ఫ్రాంక్ ఫర్ట్, జూలై 3: తృతీయ ప్రపంచ సంగ్రామాన్ని నివారించటానికి ప్రపంచంలోని "స్వతంత్ర" ప్రజాస్వామ్య రాజ్యాలన్నీ, ఆయుధాలను సజ్జీకరించుకోవడం అవసరం అని చెబుతూ అంతర్జాతీయ సోషలిస్టు మహాసభ ఈ వేళ ఒక తీర్మానం చేసింది. 33 దేశాల సోషలిస్టు పార్టీల ప్రతినిధులు ఈ సమావేశానికి హాజరైనారు. భారత సోషలిస్టు పార్టీ ఇంటర్నేషనల్ లో చేరకపోయినా, పార్టీ నాయకులలో ఒకరైన డా॥ రామ్ మనోహర లోహియాగారు సమావేశానికి పరిశీలకులుగా హాజరైనారు. పై తీర్మానం వోటింగుకు వచ్చినప్పుడు, ఒక్క జపాను ప్రతినిధులు మాత్రం తాటస్థ్యం వహించారు. తక్కినఅన్ని దేశాల ప్రతినిధులు తీర్మానానికి అనుకూలంగా వోటుచేశారు. పరిశీలకులుగా హాజరైన డాక్టరు రామ్ మనోహర లోహియాగారు తీర్మానాన్ని తీవ్రంగా ఖండించారు.

పెట్టుబడిదారీ విధానమూ కమ్యూనిజమూ ఈ రెంటిలో యేదీ కూడా ప్రపంచసమస్యలను పరిష్కరించ లేకపోయిందనీ, అట్లాంటిక్ కూటమికీ రష్యన్ కూటమికీ ప్రస్తుతం ఆట్టే తేడా లేదని ఆయన అన్నారు. ఆసియా ఆఫ్రికాల ఆర్థికాభివృద్ధికి ఇతోధికంగా కృషి జరగాలని అంతర్జాతీయ సోషలిస్టు మహాసభ తన తీర్మానంలో విజ్ఞప్తి చేసింది.

ఆయుధోత్పత్తివల్ల ప్రజల జీవన ప్రమాణం యింకా తగ్గిపోగలదనే కారణంతో తీర్మానంపట్ల తాముతాటస్థ్యం వహించామని జపాను ప్రతినిధులు వివరించారు.

బ్రిటిష్ లేబర్ పార్టీ కార్యదర్శి మార్గన్ ఫిలిప్స్ మహాసభకు అధ్యక్షుడుగాను, పశ్చిమ జర్మనీ సోషలిస్టుపార్టీ ఉపాధ్యక్షుడు ఎరిక్ ఓలెన్ హార్ ఫ్రెంచి సోషలిస్టు పార్టీ నాయకుడు లూయిస్ లెవీ ఉపాధ్యక్షులుగాను ఎన్నుకోబడినారు.

## రేడియో

### జూలై 7 శనివారం

**విజయవాడ**

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు (ఎ) వలె 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 1 మద్రాసు (బి) వలె 1-30 ఆంగ్లమున వా॥ 1-40 హిందీలో వా॥ 1.50 తెలుగున వా॥ 4 వనితావాణి (రి) డి. కె. పట్టమ్మాళ్ (రి) ప్రఖ్యాతాంధ్ర కవయిత్రులు మొల్ల ప్రసంగం స్త్రీల పాటలు విందు చేసినారు. కాలానుగుణమైన ఆరోగ్య మాత్రములు వేసవికాలములో ప్రసంగం పెరటితోట.

సా॥ 5-30 జంధ్యాల సత్యనారాయణమూర్తి 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6.20 ఉదయపుశ్రోతల శ్రోతల ఉత్తరాలకు జవాబులు 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయాభివృద్ధి వ్యవసాయ పరిశోధనశాలల ప్రసంగం వేయబోవని తలుపు రాధికా గీతం విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం సినిమా సంగీతం (రి) బాలరాజు సంసారం జత్రేదీప్ పరదేశ్ 7-30 నాయకల్పకము రూపకము రచన అమరేంద్ర 7-45 చిత్రవాణి (రి) సిరి షహనాయ్ సబక్ సర్ గమ్ 8 అంబటిపూడి శ్రీరామమూర్తి వయొలిన్ 8 20 జంధ్యాల సత్యనారాయణమూర్తి 8-40 అంబటిపూడి శ్రీరామమూర్తి వయొలిన్ 9 ఆంగ్లమున వా॥ 9-15 మద్రాసు వలె 9.30 ముగింపు.

**మద్రాసు (ఎ)**

ఉ॥ 7 స్వాగతము 7-30 టి. ఎస్. జ్ఞానాంబాళ్ 8 ఆంగ్లమున వా॥

మ॥ 1 మహిళామండలి తుమ్మెదపాట నమ్మి చెడుట శకునములు నమ్మితే ప్రసంగం మనవాల కించరాదటే త్యాగరాజ కీర్తనము. ఇది చేసి చూడండి. ప్రసంగం 1-30 ఆంగ్లమున వా॥ 1-40 హిందీలో వా॥ 1-50 ఫిలిం సంగీతం (రి) 2-10 (బి) వలె 2.15 డి. నటరాజన్ 2-45 గానమంజరి (రి) 4 (బి) వలె.

సా॥ 5-30 టి. బాయూర్ నాయక్ 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 రాజలక్ష్మి సంతానం 7 గీతమంజరి (రి) మీరా. ఇదయగీతం దీపక్ బాజీ 7-30 తమిళమున ప్రసంగం 7-45 ఎం. ఎం. దండపాణి దేశికర్ 9 ఆంగ్లమున వా॥ 9-15 మద్రాసు ప్రభుత్వ అభివృద్ధి ప్రణాళికలు ఆంగ్లమున ప్రసంగం 9-30 (బి) వలె 10 పాశ్చాత్యసంగీతం (రి) 10-30 ముగింపు.

**మద్రాసు (బి)**

ఉ॥ 7 తెలుగున వా॥ 7.15 ఉదయగానము (రి) తుడైయూర్ రాజగోపాలశర్మ టి. ఎం. త్యాగరాజన్ 7-30 బాలానందం నిర్వహణ న్యాపతి కామేశ్వరి రారండోయ్ పాట అక్కయ్య కబుర్లు అద్దె అద్దానాటిక చెమ్మచెక్కపాట కథ చిక్కు ప్రశ్నలు మీ పాటలూ కథలూ బాల వింత పాట శి (ఎ) వలె.

మ॥ 1 గీతమాలిక (రి) 1-30 (ఎ) వలె 1-40 ఫిలిం సంగీతం (రి) ఎం. కె. త్యాగరాజ భాగవతార్ టి. వి. రత్నం టి. ఎం దురాని 1-50 తెలుగున వా॥ 2 నేటివు నిలయవిద్వాంసుడు 2-15 పిల్లల కార్యక్రమం తమిళమున 4 పిల్లల కార్యక్రమం ఆంగ్లమున 4-30 పాశ్చాత్య సంగీతం (రి).

సా॥ 5-30 (ఎ) వలె 6-20 పాటుం సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయాభివృద్ధి వ్యవసాయ పరిశోధనశాలలు ప్రసంగం విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం సినిమా సంగీతం (రి) బాలరాజు సంసారం జత్రేదీప్ పరదేశ్ 7-30 నక్షత్రమండలము జూలై మాసమున ప్రసంగం 7-45 (ఎ) వలె 9-30 చిత్తూర్ సుబ్రహ్మణ్యపిళ్ళె (రి) 9.45 డి. కె. సరస్వతి ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రా సహా 10 కర్ణాటక సంగీతం (రి) కుంభకోణం సోదరులు ఎస్. వి. పార్థసారథి ఎస్. తి క్రిష్ణప్ప చెంబై వైద్యనాథభాగవతార్ 10-30 ముగింపు.

**హైదరాబాద్**

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 హిందీలో నేటి కార్యక్రమ సమీక్ష 7-20 వి. ఆర్. ధనం 7-50 కవాలీ మహమ్మద్ యూసిఫ్ సాధి 8 ఆంగ్లమున వా॥ 8.15 షేక్ నాజా భటోపాధ్యాయ 8-30 కవాలీ మహమ్మద్ యూసిఫ్ సాధి 8.45 గీత్ షానానా భటోపాధ్యాయ.

మ॥ 12-30 భజన్ (రి) 1 దిలానిఖార్ (రి) 1-10 సంగీతసుధ (రి) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 ఎస్. రాజేశ్వరరావు (రి) 1-50 తెలుగున వా॥

సా॥ 5-30 కన్నడమున కార్యక్రమం 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6.20 కవాలీ మహమ్మద్ యూసిఫ్ సాధి 6-35 తబ్లా పరగత్ తోరా మహమ్మద్ ఖాన్ 6.45 గ్రామసీమ తులసీదాస్ భజనావళి మణికరావు 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ భక్తమార్కండేయ హరికథ వేలూరి నరసింహాచార్యులు విశేషాలు మార్కెట్ ధరలు వాతావరణము 8-15 ఉర్దూలో ప్రసంగం 8-30 వి. ఆర్. ధనం 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 హిందీలో కవి సమ్మేళనం 10-15 ముగింపు.

## మదరాసు ధరలు

మదరాసు, జూలై 5.

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు నవరసు 1-8 ఎద్వర్డుబొమ్మ పేల్చుటాక్సుతోనహా రు. 77.8.0 పెట్టుబంగారు తులం 113.6.0 మూన బంగారు 111.4.0 సీమవెండి తులం 100-8 (రెడి) 197.8.0 వెండి తులం 1-8 2.1.0.

వేరుశనగ: (531 వీ 1-8 ఎక్సుకోసా గిడ్డంగులు మెషిన్-పేల్చుటాక్సుతో సహా) క్యాండి.

| | |
|---|---|
| కొరమాండల్ | 215-0-0 |
| కడిరి | 220-0-0 |
| వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ మిల్లో 3% | |
| నామినల్ (500 వీ) | రు. 432-0-0 |
| కొంకాయ నూనె (37½ వీసెలు గల డబ్బా) ఒకటి | |
| క్వైలాన్ (ఎమ్. ఎస్. బ్రాండ్) | రు. 40-8.9 |
| కాలికట్ | రు. 40-6.9. |

ఆముదం

| | |
|---|---|
| 500 వీసెలు గల బారువ ఒకటికి "తిరుపత్తూర్" | రు. 530.0-0 |

పంచదార

| | |
|---|---|
| "నరసారావుపేట" | రు. 550.0-0 |
| పారి ("దబ్లియు") | రు. |
| మోతిహరి | రు 103-12-1 |



















Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika No. 7. Thambu Chetty Street, Madras.